# శ్రీ సాయి శతకం

## శ్రీ సాయి కమనీయ చరితము

అంబట్ల రవి




Regd. No. 250/75

ప్రచురణ

**జాతీయ సాహిత్య పరిషత్**

ఇందూరు శాఖ (నిజామాబాద్)

ఆంధ్రప్రదేశ్.

# శ్రీ సాయి శతకం

## శ్రీ సాయి కమనీయ చరితము

అంబట్ల రవి




ప్రచురణ

జాతీయ సాహిత్య పరిషత్

ఇందూరు శాఖ (నిజామాబాద్)

ఆంధ్రప్రదేశ్.

# SRI SAI SHATHAKAM
By Ambatla Ravi

## శ్రీ సాయి శతకం
- అంబట్ల రవి

ప్రథమ ముద్రణ : 2002 డిసెంబర్

ప్రతులు : 1000



ప్రచురణ :
**జాతీయ సాహిత్య పరిషత్** - ప్రథమ కుసుమం
ఇందూరు.

ప్రతులకు :
**శ్రీ సాయిబాబా దేవస్థానం,**
మాధవ నగర్,
నిజామాబాద్.

**అంబట్ల రాజేశ్వర్,**
ఇం.నెం. 1-60/1,
ధర్మారం (బి),
డిచ్‌పల్లి (మండలం),
నిజామాబాద్ - 503 230,
ఫోన్ : 08461-245151.

**విశాలాంధ్ర బుక్ సెంటర్,**
కావ్య మెస్ ప్రక్కన,
ఆర్.పి. రోడ్, నిజామాబాద్.

మూల్యం : రూ॥ **25/-**

ముద్రణ:
**శ్రీవిద్య గ్రాఫిక్స్ & ఆఫ్‌సెట్ ప్రింటర్స్,**
జవహార్ రోడ్, నిజామాబాద్.
ఫోన్ : 253196.

**ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి,**
అధ్యక్షులు, తెలుగు శాఖ,
ఆర్ట్స్ కళాశాల,
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
భాగ్యనగర్.

# ఆధ్యాత్మిక పరిమళం

నాటి నుండి నేటి వరకు తెలుగు సాహితీమ తల్లికి మకుటం శతకవేం. ఈ గౌరవం ఒక్క శతకానికే దక్కింది. మల్లికార్జున పండితారాధ్యుని "శ్రీగిరి మల్లికార్జునా!" శతకం మొదటిది. అయితే ఇది పూర్తిగా దొరకలేదు. పూర్తిగా దొరికిన మొదటి శతకం పాల్కురికి సోమనాథునిది. అది వృషాధిపశతకం. "బసవా ! బసవా ! బసవా! వృషాధిపా!" ఇదీ దాని మకుటం.

ఆ తర్వాత శతకం విరాట్స్వరూపం ధరించింది. ఈ విరాట్స్వరూపం పైననే ప్రొఫెసర్ కోపూరు గోపాల కృష్ణా రావు గారు పరిశోధన చేశారు. అది ఆంధ్ర శతకవాఙ్మయంగా అందుబాటులోకి వచ్చింది. వారు సేకరించి విశ్లేషించిన శతకాలకు రెండు మూడింతలుగా ఆ తర్వాతి కాలంలో వచ్చాయి, ఇప్పుడూ వస్తున్నాయి, ఇంకా వస్తాయి.

కలం పట్టి పద్యం ఓనమాలు దిద్దుతున్న ప్రతి కవి శతకం వ్రాయాలని ఉబలాట పడ్డాడు. ఆ విధంగా వేల కొలది శతకాలు వచ్చాయి. నెలకో పది శతకాలు వస్తున్నాయి. అందులో భక్తి శతకాలు మరీను.

ఈ **శ్రీ సాయి శతకం** ఆ కోవకు చెందింది. చిరంజీవి **అంబట్ల రవి** విరచితం.

మూల విరాట్టు ఒక్కరే అదొక చైతన్యం. ఆ చైతన్యం విస్తరించింది. అమీబా నుండి జనాభా వరకు "ఏకోనపి బహుస్యామః" భగవంతుడే తాను ఇంతగా విస్తరించాలనుకొన్నాడు. అందుకే సృష్టిలో ఎటు చూచినా చైతన్యమే.

సృష్టికర్త (క్రియేటర్) యొక్క ఈ సృష్టి మామూలుగా అర్థం కాదు. మలిన హృదయులకు అసలే అర్థం కాదు; సృష్టిని ఆకారాత్మక దృష్టితో (Negetive out look ) చూచే వారికి అసలే అర్థం కాదు.

ఈ విషయంలో స్వామి రామతీర్థ ఒక కథ చెప్పారు. ఆ కథ ఇది. "ఓ రాజు దగ్గరికి ఇద్దరు చిత్ర లేఖకులు వచ్చారు. తామిరువురు చిత్రాలు వేస్తామన్నారు. ఓ హాలులో ఎదురెదురుగా ఉన్న గోడ మీద చిత్రాలు వేయడానికి సిద్ధమయ్యారు. ఒకరిని ఒకరు చూచుకోరాదు, సంప్రదించుకోరాదు, అని హాలు మధ్యలో తెరకట్టించారు. ఆరు నెలల సమయం తీసుకొని ఇరువురూ చిత్రాలు వేశారు.

రాజూ, మంత్రులు, చిత్రకళా నిపుణులు చూడడానికి వచ్చారు. ఒక వైపు చిత్రం చూచి ఎంతో మెచ్చుకొన్నారు. అది సజీవ చిత్రం, ఎంతో బావుంది. ప్రశంసించారు; అభినందించారు. అటువైపు వెళ్లి చూశారు. అక్కడ ఇదే చిత్రం. రెండింటికి ఎంత మాత్రం తేడా లేదు. మరీ దగ్గరికి వెళ్లి చూశారు. చిత్రమే కాదు; చూచే వారి బొమ్మలు కూడా ఆ గోడపై కనిపించాయి.

రాజూ, మంత్రులు అందరూ ఆశ్చర్యపోయారు. 'రాజా ! ఇది చిత్రం కాదు అద్దం. ఆ సృష్టికర్త చేసిన ఈ సృష్టి హృదయాల్లో, మనస్సులలో నిలవాలి అంటే అద్దంలా మారాలి. లేక పోతే ఈ సృష్టి అర్థం కాదు.

రకరకాల మాలిన్యాలతో దుమ్ముపట్టిన అద్దంలా ఉన్న వారిలో బొమ్మ నిలవదు'.

ఇంత అర్థం అందులో దాగి ఉండడంతో రాజు గారు ఆశ్చర్య పోయారు. సృష్టితత్త్వాన్ని తెలుసుకోవాలంటే అందరూ నిర్మలంగా ఉండాలన్న సంగతి అర్థమైంది."

స్వామిరామతీర్థ వేదాంతం ఇటువంటి చిన్న కథలతో బాగా అర్థమవుతుంది. భగవంతుని తత్త్వమే ఇది. అందువల్ల భగవంతుణ్ణి అర్థం చేసుకొని లోన నిలుపుకోవాలంటే కూడా మనో హృదయాలను అద్దంలా మార్చుకోవాలి.

షిర్డీసాయి విషయంలో శ్రీ రవి చేసిన పని ఇదే. భక్తి ప్రపూర్ణ హృదయంతో కర్మాచరణ నుండి జ్ఞానయోగం వైపుగా పయనించిన యువకవి రవి.

**"దాచినంతన ప్రేమలు దాగ బోవు**
**ముల్లె గట్టి మురియ చూడ ముసరి పోవు**
**మనసు విప్పనంతగనవి మాయమవవు**
**విప్పిచెప్పి చూడంగను విరియు సాయి".** **27**

స్వామి వచ్చి లోన కూర్చుంటే ప్రేమ ముఖం మీద తాండవిస్తుంది. ఇక అది దాచిపెట్టలేం. దానిని ముల్లె గట్టుకొని మురిసిపోవచ్చు; అది ముసురుకోవచ్చు; మనసు విప్పగానే మాయం గావచ్చు. కాబట్టి ఇవన్నీ విప్పుకోవాలి, చెప్పుకోవాలి; చూచుకోవాలి; అప్పుడు విరిసి పోతుంది.

ఈ విరయడం పరమాత్మపరంగానే; అది ప్రేమే. అది పువ్వులా విరిస్తే తాత్త్విక పరిమళాలు గుప్పమంటాయి.

ఈ శరీరం ఉపాధి. అందులోని మనస్సు ముడచుకొని పోరాదు.

అది విచ్చుకోవాలి. అప్పుడు ఉపాధి కళ కళలాడుతుంది. అయితే చేతనమైన ప్రాణం పరమాత్మతో లయం కావాలి. అప్పుడే బాహ్య ప్రవర్తనలు అందరికీ ఆనందాన్ని ఇస్తాయి. ఇంత తాత్త్వికాంశాన్ని నిక్షిప్తం చేసుకొన్న పద్యాలెన్నో ఈ శతకంలో ఉన్నాయి.

26, 30 పద్యాలలోని ఆధ్యాత్మికాంశాలు మనస్సును కదలిస్తాయి. బుద్ధిని నిలుపుతాయి. విజ్ఞానాన్ని అందిస్తాయి, ఆధ్యాత్మిక మానసికతను నిర్మాణం చేస్తాయి.

మానవునికి భౌతిక శక్తి, మానసిక శక్తి, బౌద్ధిక శక్తి, ఆధ్యాత్మిక శక్తి కావాలంటారు స్వామి వివేకానంద. ఆ దిశలో మనిషిని నడపడానికి ఈ శతకం ఉపయోగపడుతుందని భావిస్తూ, చిరంజీవి అంబట్ల రవికి ఆశీరభినందనలు తెలుపుతూ, ఆయన అభ్యుదయాన్ని ఆకాంక్షిస్తున్నాను. ఇటువంటి గ్రంథాలు మరిన్ని వారి కలం నుండి వస్తాయని ఆశిస్తున్నాను.

భాగ్యనగర్,

17-12-2002

డా॥ కసిరెడ్డి
కార్యదర్శి,
జాతీయ సాహిత్యపరిషత్,
ఆంధ్రప్రదేశ్.



డా॥ శాస్త్రుల రఘుపతి,
ఎం.ఏ. పిహెచ్.డి.
తెలుగు శాఖాధ్యక్షులు,
గిరిరాజ్ ప్రభుత్వ కళాశాల,
నిజామాబాద్.

# అక్షరాశీస్సులు

తెలుగు సాహితీనందన వనంలో ఇటీవలే మొలకెత్తిన యువకవి **అంబల్ల రవి** అనే కవితాలత వెంటవెంటనే పాదులు తొడిగి పద్యకవితా రూపంలో మొగ్గలను తొడిగి **'శ్రీ సాయి శతక'** పుష్పగుచ్ఛంగా పరివర్తనం చెంది ఆంధ్ర సరస్వతీ గళసీమ నలంకరించింది.

పద్య కవిత్వమంటేనే నేటి యువతరానికి గుబులనే అపవాదును పటాపంచలు చేస్తూ రెండు పదుల వయస్సు కూడా నిండని ఈ యువకవి తన కలాన్ని ఝుళిపించి కమ్మని తేటగీతి పద్యాలతో శతకాన్ని కూర్చి సాయినాథుని మీది భక్తిని ప్రదర్శించుకుంటూనే యుక్తితో వర్తమాన సమాజంలో పొడసూపుతున్న అనుచిత వైఖరుల్ని దుయ్యబడుతూ, వానిని నివారించమని తమ ఇష్టదైవానికి మొర పెట్టుకున్నాడు.

డిగ్రీ తృతీయ సంవత్సరం చదువుతున్న విద్యార్థి పద్యాలనల్లాలని చేసిన ఆలోచన, ఆ ఆలోచనలను అక్షర రూపంగా మలచి అవి అక్షరమై నిలవాలని అతనిలో నెలకొన్న పట్టుదల, దానికతడు అనవరతం పరితపించి తపించిన తీరు నన్ను ముగ్ధుణ్ని చేశాయి. అందుకే ఆ పద్యాల్ని రత్నాలుగా మలచాలనే ఈ చిరంజీవి ఆశయానికి 'వాదోడు' ఇవ్వటం జరిగింది. తెలుగు కవితా వాణికి భక్తితో పద్యశతకాన్ని కూర్చిన ఈ యువకవిని మనసారా అభినందిస్తూ, ఇంకా ఎన్నో రచనలను కూర్చే ప్రతిభా సంపత్తులను ఇతనికి సమకూర్చాలని ఆ 'మాధవ' సాయినాథుని వేడుకుంటూ ఈ చిరంజీవికి అండగా నిలిచి స్ఫూర్తినిచ్చి ప్రోత్సహించిన ఇందూరు జాతీయ సాహిత్య పరిషత్ ప్రధానకార్యదర్శి శ్రీ కె. గంగాధర్ గారినీ, సహకరించిన తదితరులనూ అభినందించుతూ ఈ వర్ధమాన కవికి శుభాశీస్సులనందజేయుచున్నాను.

ఇందూరు,
డిసెంబర్1, 2002



డా॥ శాస్త్రుల రఘుపతి
అధ్యక్షులు జా.సా.ప. ఇందూరు.

**శ్రీమతి పి. శాంతమ్మ,**
హిందీ ఉపన్యాసకురాలు,
ప్రభుత్వ బాలికల జూనియర్ కళాశాల,
కోటగల్లి, నిజామాబాద్.

# రవి 'రవి' లా వెలగాలి...

నా శిష్యుడైన రవి చిన్న మాటయనెడు భావాల మూటను సాయి సన్నిధికి శతక రూపంలో చేర్చ ప్రయత్నించినాడు. శతక మల్లిన తీరు చక్కగా ఎంతో అందంగా వుంది. ప్రప్రథమంగా భక్తి కుసుమాలను సాయి చరణాలకు అర్పిస్తూ కులదైవమైన 'శ్రీ రాజరాజేశ్వర స్వామి'తో పాటు ఇష్ట దైవాలను కూడా ప్రార్థిస్తూ శతకమాలకు తగిన తీరు తీరు పూలను సమకూర్చుకొని తాను ఒక్కడే కాక తనతో పాటు సమాజాన్నంతటిని సాయి దరికి చేర్చ ప్రయత్నించినాడు. రవి **'రవి'** లాగా తేజోవంతంగా వెలగాలని ఆశిస్తూ...

హృదయ పూర్వకంగా నా ఆశీస్సులను అందిస్తున్నాను.

ఇందూరు,
12 నవంబర్, 2002

**- శ్రీమతి పి. శాంతమ్మ**



**డా॥ కె.వి. యస్. రావు**
B.Sc., B.H.M.S.
ప్రముఖ హోమియో వైద్యులు
శ్రీ సాయి హోమియో క్లినిక్
ఖలీల్‌వాడి, ఇందూరు.

# అభినందన

జాతీయ సాహిత్య పరిషత్ అభిమాని అయిన యువకవి రవి, సరళమైన పదజాలంతో కవిత్వం వ్రాయడానికి శ్రీకారం చుట్టి తన కవిత్వ జైత్రయాత్రను మొదలు పెట్టాడు. మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, దేశ భక్తి, దైవ భక్తిలతో కూడిన పద్యకుసుమాలతో అల్లిన శతకమాలను ఆ సాయినాథునికి సమర్పించడం నాకెంతో ఆనందాన్నిచ్చింది. శ్రీ సాయి హోమియో క్లినిక్ నందు పనిచేస్తూ.... స్థానిక డిగ్రీ కళాశాలలో విద్యార్జన చేస్తూ.... తీరిక వేళల్లో రచనలు చేస్తూ... తన మొదటి రచనను ఆవిష్కరించడం అభినందించదగిన విషయం.

ముందు ముందు ఇంకెన్నో రచనలు చేయాలని ఆశిస్తూ.... ఉన్నత స్థాయికి చేరాలని ఆశీర్వదిస్తూ.... అభినందిస్తున్నాను....

ఇందూరు,

**డా॥ కె.వి.యస్. రావు**

తేది: 18-12-2002.



**కె. గంగాధర్**
M.A., M.Phil., (Ph.D.)
తెలుగు లెక్చరర్,
ప్రధాన కార్యదర్శి,
జాతీయ సాహిత్యపరిషత్, ఇందూరు.

# ఇంకా ఎదగాలి...

నా శిష్యుడు చిరంజీవి రవి చాలా తొందరపడి ఈ 'శ్రీసాయి శతకా'న్ని మీ ముందు పెట్టాడు. మృధు స్వభావి, నిష్కల్మషి. నిరాడంబరి అయిన రవి మొదట్లో మాటలనే పద్యాలు వ్రాసి చూపెట్టినాడు. ఛందో లక్షణాలు తెలుసుకొమ్మని సలహా ఇచ్చాను, పుస్తకాలు చదవమన్నాను, కొన్ని ఇచ్చాను రోజుకో పద్యం రాసి తెచ్చి చూపెట్టేవాడు. భావం ఉండేది కాని శిల్పం ఉండేది కాదు. ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న ఈ శతక పద్యాలు అందమైన శిల్పాకృతిగా రూపం సంతరించడానికి జా.సా.ప. కార్యవర్గ బృందం సహకరించారు.

మట్టిలోని మాణిక్యంగా రవి శతకమాల రూపుదిద్దుకొంది. తర్వాత సమస్య ముద్రణ. నేటి కాలంలో పుస్తక ముద్రణ ఆషామాషీ వ్యవహారం కాదు. ఎందరో సహృదయులు తమ సహకారం అందించారు.

రవి నా శిష్యుడైనందుకు గర్వపడుతున్నాను. అలాగే ఈ ఒక్క శతకంతోనే ఆగి పోకుండా భవిష్యత్తులో మరిన్ని పుస్తక రచనలు అందించాలని, ఇంకా ఎదగాలనీ, అందరికి ఆదర్శంగా నిలవాలని.... ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ, ఆశీర్వదిస్తూ...

ఇందూరు,

తేది: 20-12-2002.



కె. గంగాధర్

# జాతీయ సాహిత్య పరిషత్ - ఇందూరు

# కార్యక్రమాలు - సమీక్ష

యువతకు దేశ భక్తిని, జాతీయతను వివిధ సాహితీ ప్రక్రియల ద్వారా అందించి, వారి భవిష్యత్తుకు మంచి మార్గాన్ని చూపించే సదాశయం జాతీయ సాహిత్యపరిషత్‌ది. ప్రముఖ పండితులచే 1975లో స్థాపించిన జాతీయ సాహిత్య పరిషత్ రాష్ట్ర వ్యాప్తంగా నేడు సుమారు 80 శాఖలతో విస్తరించింది.ఎన్నో కార్యక్రమాలు నిర్వహిస్తుంది. సాహితీ సాంస్కృతిక చారిత్రక రంగాలలో ఘనమైన చరిత్ర గల ఇందూరు జిల్లాలో జాతీయ సాహిత్య పరిషత్ కామారెడ్డి, ఆర్మూర్, బోధన్, ఇందూరు తదితర శాఖలతో సాహితీ సేవ చేస్తుంది.

ఇందూరు జా.సా.ప. నేటి వరకు ఎన్నో కార్యక్రమాలు నిర్వహించింది. వైదిక రాజ్యం సంస్థాపకులు, వేద గురుకులం సంచాలకులు కర్మయోగి నారాయణ జిజ్ఞాసు గారి 'ఆవు అందరికీ అమ్మ' పుస్తకం డా॥ కసిరెడ్డి వెంకట రెడ్డి గారి ఆవిష్కరణతో ప్రారంభమైన కార్యక్రమాలు ఎందరో సహృదయుల సహకారంతో నేటికీ సాగుతూనే ఉన్నాయి.

జిల్లా కవుల పుస్తకావిష్కరణలు. కళాకారులైన ఉపాధ్యాయుల పురస్కారం 'ఆచార్య దేవోభవ', అంతా కొత్త కవులతో నవ యువ కవి సమ్మేళనం 'సాహితీ శరత్ పూర్ణిమ', ఛందస్సు, పద్యం, వచన కవిత్వం, వ్యాస రచన, ఉపన్యాసం, నాటకం, కథానిక, క్షణాల్లో చిత్ర లేఖనం, సంగీతం మొదలగు 10 అంశాలపై 'సాహితీ శిక్షణా శిబిరం' నిర్వహించడం జరిగింది. ఇందులో సుమారు 100 మంది యువకులు పాల్గొన్నారు. ఆ తర్వాత సాహితీ శరత్ కౌముది, కార్తీక దీప కళికలు, జాషువా జయంతి ఉత్సవాలు నిర్వహించాం.

ఈ శతకకర్త అంబట్ల రవి సాహితీ శిక్షణా శిబిరంలో పాల్గొని పద్యంపై మక్కువ పెంచుకొని శతకమే వ్రాశాడు.

భవిష్యత్తులో జాతీయ సాహిత్య పరిషత్ యువతీ యువకుల్లో అంతర్గతంగా ఉన్న కళల్ని ప్రోత్సహించే ఉద్దేశ్యంతో ఎన్నో సాహితీ కార్యక్రమాలు నిర్వహించడానికి సహృదయులైన మీ అందరి సహకారాన్ని కాంక్షిస్తూ...

మీ

**జా.సా.ప. కార్యవర్గం**

ఇందూరు

# నామదిలోని మాట....

ఆర్తితో 'బాబా' అని పిలిచినంత పలికే ఆ షిర్డీ సాయినాధుని మీది భక్తి నన్ను ఈ శతకం వ్రాయడానికి పురికొల్పింది. సృష్టిలో విలువైన అమ్మనాన్నల ప్రేమ, గురువుల యొక్క చల్లని ఆశీస్సులు ప్రసాదించిన ఆ బాబాకు నా ప్రణామాలు.

నా కవితా అడుగులు తడబడుతుంటే దానికి రూపు రేఖలు దిద్ది, అనుక్షణం నావెంటే తోడుండి, నా కవితాభివృద్ధిని కాంక్షించి, నన్ను అక్కున చేర్చుకొని వాక్ సుధామ తల్లి ఒడిలో నిలిపిన నా గురుదేవులు శ్రీ కె. గంగాధర్ (జాతీయ సాహిత్య పరిషత్-ఇందూరు శాఖ ప్రధాన కార్యదర్శి) గారు ఈ శతకానికి ప్రేరణ. తానే లేకుంటే నాలోని ఈ భావాలు ఇలా బయటకు వచ్చేవి కావు.

పద్యమంటే తెలియని నేను శతకం వ్రాశానంటే నమ్మలేను. శ్రీ ఆకుల వెంకటరాములు గారి శ్రీ నీలకంఠేశ్వర శతకం ఆవిష్కరణ సభలో పాల్గొనడం, శతకం చదవడం, పద్యాలపై మక్కువ ఏర్పడడం, పద్యాలు వ్రాయాలన్న ఆలోచన ధృడ పడటం జరిగింది. ఆ రోజు నుండి రోజుకో పద్యం వ్రాసి గురువునకు చూయించగా తప్పులను సరిచేసి, ప్రోత్సాహం అందించారు తప్ప ఒక్క రోజైన నిరుత్సాహ పరచలేదు. ప్రతి సాహితీ సభకు తనవెంట నన్ను తీసుకొని వెళ్ళి సాహిత్య విషయాలు, కవుల పరిచయాలు చేశారు. జాతీయ సాహిత్య పరిషత్తుకు అభిమానినయ్యాను, కార్యవర్గసభ్యుడయ్యాను.

నాకు ఎదురైన ప్రతి సందర్భాన్ని నాలోనే దాచుకోలేక, కలం పట్టి కాగితంపై పెట్టి ఆ సాయినాధున్ని స్మరించాను. అది పద్యమై ఒక రూపానికి వచ్చి తీరా **"శ్రీ సాయి శతకం"** గా మారింది.

తెలుగు పదాలకు సొగసైన రూపాలు అమర్చి తెలుగు తల్లి కీర్తి కిరీటాలై తెలుగుతనాన్ని గగనసీమలో ఎగురవేసే ఎందరో కవులు కళాకారులు ఈ నేలపై

వున్నారు. ఈ శతకానికి తాను ఎంతో తలమునకలయ్యే పనులలో వున్న నన్ను ప్రోత్సహించాలన్న సదుద్దేశ్యంతో పుస్తకానికి అందాన్ని చేకూర్చే పీఠికను **"ఆధ్యాత్మిక పరిమళం"** గా మలచిన **ఆచార్య కసిరెడ్డి వెంకట రెడ్డి** జాతీయ సాహిత్య పరిషత్ రాష్ట్ర కార్యదర్శి, ఆర్ట్స్ కళాశాల తెలుగు శాఖ అధ్యక్షులు (ఉస్మానియా) గారికి నా హృదయపూర్వక వందనాలు.

నా ఈ తొలిప్రయత్నానికి తగిన ప్రోత్సాహమిచ్చి, ఇప్పుడిప్పుడే సాహితీ నందనవనంలో అడుగిడిన నాకు చేయూత నిచ్చి, సలహాలనిచ్చి, సవరణలు చేసి సాహితీ కుసుమాన్ని ఆవిష్కరిస్తోంది ఇందూరు జాతీయ సాహిత్య పరిషత్. పరిషత్ అందించిన సహాయ సహకారములు మరువరానివి. జా.సా.ప. అధ్యక్షులు డా॥ శాస్త్రుల రఘుపతి గారికి, ఉపాధ్యక్షులు డా॥ గణపతి అశోక శర్మ గారికి, శ్రీ ఆకుల వెంకటరాములు గార్లకు నా ప్రత్యేక కృతజ్ఞతలు. అలాగే నన్ను వెన్ను తట్టి ప్రోత్సహించిన శ్రీ సాయి హోమియో క్లినిక్ వైద్యులు డా॥ కె.వి.యస్. రావు గారికి, శ్రీ వెంకన్న గారికి, స్నేహానికి ప్రతిరూపాలైన నా చిన్న నాటి స్నేహితులు నర్సయ్య, రాషద్, మధు లు, ఈ ప్రయత్నంలో ప్రోత్సాహం అందించిన మాధవనగర్ సాయిబాబా ఆలయ అర్చక మరియు కార్యవర్గ బృందంకు, సకాలంలో పుస్తకాన్ని వెలువరించిన శ్రీ విద్య గ్రాఫిక్స్ & ఆఫ్‌సెట్ ప్రింటర్స్ గారికి, ఈ పుస్తక ముద్రణకు ఆర్థిక సహాయ సహకారాలు అందించిన ప్రతి ఒక్కరికి కృతజ్ఞతలు.

ఆధ్యాత్మిక బాటలో మొదలైన నా సాహితీ ప్రయాణంలో త్వరలో వెలువడనున్న 'మనసు విప్పనా...' కవితా సంపుటికి అందరి ఆశీస్సులు కోరుతూ ఈ శ్వాస ఉన్నంత వరకు కలం బట్టి గళం విప్పుతానంటూ....

సాహితీ వనంలో ఓ మొగ్గ

ఇందూరు,
తేది : 20-12-2002



మీ ..... **రవి**





# అంకితం

తల్లిదండ్రులిచ్చిన పూలనల్లి నీకు
గురువు లిచ్చిన బిగువైన గురుతు తోడ
శతక మాలను పేర్చి నీ శరణు కోరి
అంకితంబివ్వ నిలిచితినయ్య సాయి

అమ్మా నాన్న...



శ్రీ అంబట్ల రాజేశ్వర్ - శ్రీమతి అంబట్ల సావిత్రి

## శతకమల్లిన తీరు

- భక్తి కుసుమాలతో
- మనస్సు మణిహారాలను
- బ్రతుకు బాటన
- సమాజ తాంబూలములో
- ఏర్చి కూర్చి పేర్చితి .... !

# ప్రార్థన

విన్నవించుచుంటిని స్వామి వినయముగను
శతక మాలను కూర్చగ శరణు గోరి
నిన్ను తలచి యుంటిని మది నిండ నిల్పి
విఘ్నములను తొలగ సేయు విజయ సాయి. 1

శుభములొసగు మూలపుటమ్మ చూడవమ్మ
మహిమ గల తల్లి మొక్కెద మనసుతోడ
నీ కృపా కటాక్షమ్ముల నింపవమ్మ
యని, సరస్వతి వేడెద నయ్య సాయి 2

## భక్తి కుసుమాలు

సుప్రభాత వేళాయెనో సుప్రకాశ
భానుడుదయించె పొద్దెక్కి బారెడయ్యె
భక్త జనులెల్ల నిను చేరి భజన సేయ
పూజలను గొని దయ చూడ పూను సాయి 3

నిర్మల మనముతో పూజ నీకు సేయ
భక్తులెల్ల మందిరమున భజన లొసగ
పూలు పళ్లతో దూప దీపాల తోడ
వచ్చి యుండిరి దీవించు భవ్య సాయి 4

భక్తు లెక్కడ నున్నను వరములిచ్చి
పాప సంచయమ్ములనన్ని పాపి వేయ
మాధవ నగరమందున మాని తముగ
షిరిడిని తలపింపనిట నిల్చితివి సాయి 5

పద్మమల్లగ కోరిక పల్లవించ
ఆకుల పరిచయమ్ముతో నదియు పెరిగె
పూర్తి జేయుటకు దగిన స్ఫూర్తి నిచ్చి
నీల కంఠేశ శతకమ్ము నిలిచె సాయి 6

నా కలము కవితల నల్లి నీ కొసంగ
నిండు మనసుతో మనసులో నిలిచిపోయి
శతకము పరిపూర్తిగ స్సేయు శక్తి నొసగి
సాగ నివ్వుము సొంతమ్ము సాధు సాయి 7

తెలియ కుండెను నాకు నీ తీపి చెలిమి
చూడ కుండగ ఉండను సుందరాంగ
కనికరముతో నొసగితివి గంగధరుని
కూర్మితో నిల్చె మనసైన గురువు సాయి 8

పాల రాతి కందిన పుణ్య వరమదేదో
మేను రూపముతోనిట మెరిసిపోయె
పూల కబ్బిన ఏనాటి పుణ్య ఫలమొ
నీదు మెడలోన దండగా నిలిచె సాయి 9

ఎందరెందరినో ధరణి ఎరిగి యుండె
తీరు తీరు రూపంబుల తీరు చూసి
మేలిమైనట్టి రూపుతో మెరియునట్లు
తనదు కళలతో నిను తీర్చ తలచె సాయి 10

దత్త రూపుడ మాపైన దయను చూపు
వరములిచ్చు దేవర మమ్ము వదల తగదు
కనులుగల్గిన అంధుల కరణి మేము
వెదకుచుంటిమి దారి చూపించు సాయి 11

ఇంత సృష్టికి మూలమై ఇలను చేరి
మమ్ము గాంచెడి గురువువు మాదుజనక
ఆలయమ్మున గురువారమందు జనులు
భక్తితో నిను గొలుతురు భవ్య సాయి 12

అవని నేలెడు ప్రభువర ఆదుకొనుము
నింగి నిండిన దైవమా నిలువ రమ్ము
అంద చందాల నాథుడ అందుకొనుము
భక్తి నొసగు పూజలనిల బాబ సాయి 13

వేములాడలో వెలసిన వేల్పు వీవ
భక్తి తోడ కొలుచు చుంటి పరమ శివుడ
ఇంటిలో ఇలవేల్పుగా ఇమిడి పోయి
మమ్ము చల్లంగ కాపాడు మహిత సాయి 14

తల్లి దండ్రులులేనట్టి తనయుడవట
ఆలు బిడ్డలు లేని విశ్వాంగుడవట
షిరిడి చేరిన పుణ్యాత్మ సిద్ధరూప
అందుకొనవయ్య పూజలనిందు సాయి 15

ఇంద్రపురి భాగ్యమదియేమొ ఇచట నీవు
హృదయ గోపురమున నిల్చి ముదముతోడ
అడిగినంతనే కరుణతో నరుగుదెంచి
భాగ్యమొసగుచు నుందువు బంధు సాయి 16

సద్గురుని లీల గాంచని చవట నేను
జన్మ నిచ్చితివెందుకు జనక నాథ
ఉన్నఫలమేమి జీవించి ఉండి నీదు
పాదముల జేర గాంచని బ్రతుకు సాయి 17

వింత వింతగ చూడకు విసుగు చెంది
నీ శరణుకోరి నీవె మా నీడవనుచు
నిండు మనసులో స్థిరముగా నిన్ను చేర్చి
కొలుచుచుందును పూజల గొనుము సాయి 18

ఆత్మ యందు నీవే పరమాత్మ నీవె
సూక్ష్మమందు మోక్షమొసగి చూడ నీవె
నీవు లేని చోటెక్కడ నిజము దెలియ
ఏది నీవు కనని అందమేది సాయి 19

జానకీరామ కళ్యాణ సమయమందు
మమ్ము నేలేటి దైవమ్ము మహిని బుట్టె
మాదు పాపాల కడుగగ మరల తండ్రి
నవమి నాడు జన్మించిన నవ్య సాయి 20

ఆలయమున నాలుగు వేళలందు నీకు
భక్తి భావన పెంపొంద పరమనిష్ఠ
భక్త జనులంత నీ నామ భజన సల్ప
హారతు లొసగ వచ్చినారయ్య సాయి 21

## మనస్సు మణిహారములు

పది కనులు పడకుండను పదిల పరచి
ముచ్చట గొలుపు తీరుగ మోము దిద్ది
భక్తి భావన లొలుకగా పరమ నిరతి
నిన్ను చేరితి మదిలోన నిలుపు సాయి 22

గర్వపడుచుందు జనకుల గాంచి నేను
ఆది గురువులయిరి నాకు అమ్మ నాన్న
ఋణము దీర్చగ నాదంటు ఏమి గలదు
వారికొసగెద నతులను భక్తి సాయి 23

చూడుమయ్య ఈ మదిలోని చూపు లెల్ల
చిత్రములు చేయు చుండెను శిథిల మవగ
నవ్వినట్టి తారల వెంట నడిచి వెడల
అదుపు తప్పెడు మముమార్చు మయ్య సాయి 24

నిన్ను చూడకున్న కనులు నిలువ వాయె
అందమైన దేముండెనో అక్షయాత్మ
నిన్ను వదలగ ఈమది నిలువ బోదు
అంధకారమై తోచె రావయ్య సాయి 25

ఎంత చెప్పిన మారదు వింత మనసు
తనకు నచ్చిన దానికి తలను ఊపి
మాను దొరికి మురిసినట్టి మల్లె వోలె
ఎదిగి పోయి నేర్చెను వెక్కిరించ సాయి 26

దాచినంతన ప్రేమలు దాగబోవు
ముల్లెగట్టి మురియ చూడ ముసరి పోవు
మనసు విప్పనంతగనవి మాయమవవు
విప్పి చెప్పి చూడంగను విరియు సాయి 27

సంకట మొకటి వాటిల్లె సంశయముగ
మొదట ఈమది పరుగెత్తి మోస బోయె
తనకు నచ్చిన దెల్ల సొంతమని తలచి
నన్ను విడచి ఎడారిలో నడిచె సాయి 28

మధుర పిలుపుతో తాకిరి మనసునెవరో
మగువయో మణి మాణిక్య మాల ఏమొ
రాగమో బంధమో లేక రాణి చెలిమి
మహిమయో నాకు తెలుపుము మహిత సాయి 29

గాలిలోని దీపానికి గాఢమైన
మనసు కలిగెను నీపైన మంజునాథ
లోకమునకంత నీదు వెల్గులను నింపి
నిరతముగ మము బ్రోవుమా నిత్య సాయి 30

ఎప్పుడెటు పోవునో మది నెరుగు నెవరు
ముందెరుగని లోకాలతో మురియ చేసి
వెనక గోతులతో మాటు వేసి యుండు
ఆటలాడే మదిని గాంచు మయ్యా సాయి 31

తలచి తలపోసి మాధైన తనువు సతము
పరితపించుచు నున్నది ప్రాణదాత
ఎదురు చూపులతో ప్రతి యెదయు గూడ
మూగ వోయె గొంతుకలన్ని సాగి సాయి 32

మానవతకు నిలయము నీ మందిరమట
అలజడుల నెదురించుచు అలసిపోయి
భక్తితో మమ్ము నీవె కాపాడుదువని
నిర్మలమ్మగు మది ముందు నిలిచె సాయి 33

మనసు నీకు మందిరముగ మలచియుంచి
పరచితిని నేను మమతల పాన్పునయ్య
సాధుమూర్తి సకల గుణశాలి దేవ
నిలుపుమయ్య ఈ మది నిండ నీవు సాయి 34

## బ్రతుకు బాటలు

లక్ష్య సాధనతో విద్య లక్షితముగ
తలచిన గురిని సాధించ వలయు నెపుడు
లక్ష్య సిద్ధియే లేకున్న లక్ష్య పెట్ట
రెవరు వారి బ్రతుకులనీ ఇలను సాయి 35

నింగి చూసి భ్రమించెడు నీలి తెరలు
కొండ తోను పందెము గాసి కుప్పగూలు
తల్లి ఒడిని మరచినట్టి తనయులెల్ల
ఎంత ఎదిగి పోయిన లాభమేమి సాయి 36

నీవు పెంచిన తోటకు నీరు లేక
కలుపు మొక్కలు పెరుగుచు కలత పెట్టె
ముళ్ళతో నిండె నీ వనములిట నేరి
వేయ దయతోడ నిలువుము ప్రేమ సాయి 37

తెల్లనగు కాగితాలపై నల్ల రాత
జీవితమ్మన రంగు పేజీలు గావు
నడుమ వచ్చిన అమృతంపు నాణ్యతయును
వ్యర్థమే కాద యోచింపవలయు సాయి 38

సాగు నది వోలె జీవిక సాగి పోవ
మధ్యలో దూరు మాయని మచ్ఛ ఝరులు
మాటి మాటికి మాయచే మదియు మారె
మాయ వల నుండి కాపాడు మమ్ము సాయి 39

నడిమి సంద్రము నందున్న నావ మేము
మధ్య తరగతి బ్రతుకులు మమ్ము గాంచు
కష్ట సుఖముల చుట్టాలు కనుల ముందు
అలల మాదిరి ఎదురుగ నయ్యె సాయి. 40

ఆలపించగ ఏ రాగ మనెద నేను
ఆకలియను నీ రాగమునాలపించ
ఇప్పుడే పుట్టిన పసికందేని చూడ
కాటికేగెడు ముసలి రాగమిది సాయి 41

విర్ర వీగుట తప్ప వివేకి ఎవరు
తాను ముందనుచు జనుడు తలచునెపుడు
సకల జీవులన్ని తెలివి చాలవనెడు
మతులు చెడ్డ ఈ భ్రమలను మార్చు సాయి 42

కడుపు తిప్పలుతో జీవ కణిక లించట
అలమటించు చుండెను దేవ ఆలకించు
ఆకలి కలి పిశాచమై అరయు చుండ
ఆపకుండ నీ కరుణను చూపు సాయి 43

చదువులమ్మకు యిష్టమౌ చంటి పాప
మట్టి నిండిన మెదడుకు మనసు గూర్చి
అక్షరముల తోడనె లోకమంత వెలుగు
చిలుకరించెడు గురువుల చేరు సాయి 44

కలమునే ఆయుధమ్ముగ కనుల జూచి
పదములన్నియు నొకటిగా పదిల పరచి
నీతి పలువ చాటుచు అవినీతినణచి
చదువులమ్మ బిడ్డ కవిని సాకు సాయి 45

ఉన్న ఊరి దొరతనమ్ము ఉచ్చుపన్ని
చేత గాని వారిని చేసి చిదిమివేయ
ఆలు బిడ్డల తలిదండ్రులాత్మ మరచి
వెడలు జనముల కరుణించు ప్రీతి సాయి 46

ఏమిటి మరి చిత్రమ్మేది ఎరుక రాక
అడుగు చుంటిని చెప్ప రావయ్య ఇపుడు
ముందు చూడు నీయాలయ మందు చూడు
వరుస గూర్చుండిరీ ముష్టి వారు సాయి 47

పనుకు బట్టెను ఫలములు పసరు లేక
పాహియనుచిల దరి చేరె పసరు కోరి
కనికరమ్మును పూనుచు గాంచవయ్య
ప్రేమ మూర్తివి నీవు మా ప్రీతి సాయి 48

ఎండమావి బ్రతుకు దూరమెంత యున్న
నీడ పట్టున కుదురుగ నిలిచి యుండు
మగని బ్రతుకును వలచిన మగువతీరు
ఇలకు ఈ జంటయే శోభ నిచ్చు సాయి 49

తెలివి యున్నను జనులకు తెల్ల మొహము
చదువులెన్ని యున్నను వీరి చవట బుద్ధి
విందు ముందరున్నను రుచి విధమెరుగదు
నీవు మార్చగ ఇటు రమ్ము నియతి సాయి 50

పల్లె పల్లె నీరాకకై పరితపించె
వానదేవుడ కరుణించి వరములిమ్ము
బ్రతుకులన్ని వాడక ముందు వాన నొసగి
మాకు దిక్కువై నిలిచిపో మాదు సాయి 51

ఒక్క చినుకైన రాదేమి ఓర్మి గూర్చ
ధరణి తల్లికి కానని దాహ మయ్యె
మేఘునకు నెట్టి మబ్బులు మేళ వించ
యిట్టి పగబూనుచు అలిగె నేమి సాయి 52

ధాన్యరాసుల కాలము దారి మరిచి
ఆకలి కడుపులన్నియు అధిక మయ్యె
రాజ్య పదవులేమియు కానరావు ధరణి
నీవు దిగిరాగ నేమిత్తు నిజము సాయి. 53

ఆశయనెడు మూటతో వచ్చె అవని తల్లి
అలసి పోయెను ఈ భారమంత మోసి
భాగ్య మెంతున్న బాధల బరువు పెరిగె
భారములు దించ రావయ్య భవ్య సాయి. 54

చల్లనైన కరుణ చూపు శాంత మూర్తి
చెదిరి పోతున్న బ్రతుకుల చింత దీర్చి
లోకమంతను నీ ప్రేమలోన నిలిపి
మా మదికి రాజువై యేలు మహిత సాయి 55

# సమాజ తాంబూలము

దృష్టి లోపమో నరునిది దుష్ట పథము
బురదలో భ్రమించగ వీరి బుద్ధి యంత
చేయుచుండిరి స్వార్థపు చేతలెల్ల
నీవు రక్షింప మాయెద నిలువు సాయి 56

నీతి ఎరుగని వారలు నీతులరసి
అనుసరించుట మరచి బోధనల పడిరి
నీతి మరచిన జనులకు నీతి దెలిపి
నీదు మహిమలు చాటగ నిలువు సాయి 57

మురియు సంపదలను గని మూర్ఛిలిచట
ఉన్న దంతయు తనదని ఉరిమి పడుచు
లేని దానికై వీరంత లేచి పడగ
ఆశకంతము ఏముండునయ్యా సాయి 58

లీలలను చేసి నువ్వు నిలిపితి వయ్యా
మమ్ము నీ సుందర జగతి మాటునందు
వ్యాప్తి చెందెను కాలుష్య వాయు గణము
నీదు మహిమతో వారింప నిలువు సాయి 59

అందమగు రూప లావణ్య మవణి యందు
సాంప్రదాయపు గౌరవ సంపదలును
మోడలింగులో ముత్యాల ముసుగు లోన
విలువ మరచెను చూడుము వినతి సాయి 60

మాట చెల్లిన వారికే మంతనాలు
మాటున జరుగునట్టిదే మదియు గాంచె
చిత్రమగు చేష్టలకులోన చింత పెరిగె
నీవు రావయ్యా నియతిని నిలుప సాయి 61

పైకి మెరిపించు వారలు పైకములను
దోచుకుని పోవుచుండిరి దొరల తీరు
వేషములు ఎన్నో గట్టిన వీరి వింత
నీవు మార్చగ రావయ్యా నిత్య సాయి 62

మానవత్వమును మనిషి మరచి పోయి
సాటి మనుజుల చంపుచు సాకుచెపుచు
జీవకోటి నెత్తురు ముద్ద జేసియాడు
నీ మనుషులను మార్చుము ఇలను సాయి 63

నీరు లేనట్టి పంటలో నిండి గరక
పంటయే తానని భ్రమించి పరుగు లెత్తు
కోత రోజు తెలియు దాని కొసరు బ్రతుకు
మూర్ఖులిటుల భ్రమింతురు ముందు సాయి 64

కాల రాత్రిలో కలి కండ్లుకమ్మి వేయ
వింత లోకమంత విధిని విడచి వెడల
పిచ్చి చేష్టల బ్రతుకులు పెరిగిపోవ
మమ్ము కాపాడ రావయ్యా మహిత సాయి 65

రేయి పగలు మరచి నల్ల రేయి ఒకటి
లోకమంతట తిరిగెను లోకనాథ
ఎంచి చూడగ ఈ భూతమెదలు పిండి
ఏలుకొను నిన్ను బాపగ నెదిగె సాయి 66

ఆగలేని కాలానికి అవధి మరచి
అడుగు వేయక ముందు ఈ అవని లోన
అంత తనదేననుచు జీవుడరయు చుండ
అసలు సొంతమైనది యేమిటయ్యా సాయి 67

నాది నీదను పోరులు నరుని యందు
తెగని రీతిగ ఎదిగెను తెలియకుండ
కుల మతాల గోడలు పెట్టి గూలు నట్టి
ఈ జనుల పోరును అణచు మిచట సాయి 68

మతము పేరిట పాపుచు మానవతను
ఉగ్రవాదము లోకాన ఉరుము చుండె
అణచి వేయు మా నాధుడవంటు మేము
నిన్ను జేరితిమిక తోడు నిలువు సాయి 69

అవనిలోన అలజడులు అధికమయ్యె
మానవత్వమును మరచి మనుజులంత
జరుపు చుండిరి మతముల జాతి పోరు
నీవు పారద్రోల నియతి నిలుపు సాయి 70

ప్రేమ చిత్రాలపై నేడు పెరిగె మోజు
మత్తులోన మునింగి మైమరచి పోయి
చదువులశ్రద్ధ చేయుచు సాగు యువత
కాలపు విలువ మరచిరి కనుము సాయి 71

దేశమన్నను ఎవరికి దెలిసి యుండు
చెప్పడానికి మాటలు చెల్లినట్లు
చెప్పినది చేయు సరికెల్ల చెదిరి పోవు
చిత్రమగు దేశ భక్తియే చింత సాయి 72

మా మతము గొప్ప చూడ మామతమె మిన్న
సాటిరాదు ఏ మతమైన సాహసించ
యనెడు మతవాదులు సిరుల అంచులందు
మురియు చుండిరి చూడుమా ముదము సాయి 73

వలదు మీకు మా భారత వనితలార
కాటిలోనికి పంపెడు కట్న కాన్క
లెల్ల, కొరివి దెయ్యములగు ఎల్లరకును
ఊర కుండనివి బిగించు ఉరిని సాయి 74

మేలు కొలుపుము జనులను మేళ వించి
యుద్ధమును కోరు మూర్ఖుల బుద్ధి మార్చి
ధైర్యమున వారి నణచుము తాల్మి తోడ
మమ్ము చేరెడు మా తండ్రి మహిత సాయి 75

నీతి తప్పదు తండ్రి ఈ నేల తల్లి
నీటి బొట్టు దొరకక కన్నీరు బెట్టి
నీ శరణుగోరె నొక మారు నిక్కి చూసి
ఆపదల బాపి రక్షింపుమయ్య్య సాయి 76

అన్న పానీయములనిచ్చు అవని ఇపుడు
అన్నమో రామచంద్రాయ టంచు అడలె
ఏమిటి మరి ఈ వింత నీ ఎదుట నింక
ఆలకించి జనుల బ్రోవు మయ్య్య సాయి 77

వాయిదాలకు జనులెల్ల వారసులయి
వాంఛ యున్నను వీరికి వలపు లేదు
కాంత చెంతనున్న కనులు కాన రాక
మూర్ఖ బుద్ధులవనిలోన మురియు సాయి 78

పదవి యున్నపుడు పరులు పంచజేరి
పదవి పోయిన నెవ్వరు పిదప రారు
సిరియు సైతము ఆ వేళ చిందు లేయు
పదవి జారిన సిరి కనపడదు సాయి 79

చేయ చేత కాకున్నను చిందు లేయు
చెమట విలువ తెలియ కుండు సోమరులకు
కాయకష్టమదేమిటో కాస్త దెల్పి
బద్ధకపు బుద్ధులను నీవు బాపు సాయి 80

జారిన తిరిగి రానిది జనుని మాట
కలత పెంచి కత్తులు దూయు కసిది మాట
మనసు నింపగ నుండును మంచి మాట
మాటలన్నింట నిలుపు నీ మహిమ సాయి 81

తల్లి ఋణము తీర్చుకొనగ తనను మరచి
కాన రానంతగ జవాను కదిలి పోయి
బాధల భరించి తల్లిని భద్రపరచు
వీర పుత్రులలో మేటి వీడె సాయి 82

మాటు వేసిరి చోరులు మూట గట్ట
రాత్రి వేళలో వీరంత రాటుదేలి
పగటి వేళనే చోరీకి పాలుపడుచు
నిన్ను ముంచగ నున్నారు నిజము సాయి 83

అడుగు వేయ అలజడులు అవని యందు
వికట హాసము చేయగ వెట్టి గూడె
ఏ క్షణమునేమి చేయునో వెక్కిరించి
ఈవు కాపాడ రావయ్య ఇలను సాయి 84

మాయ చేయ తలచి కలి మహిని ముంచ
ఆగనంతటి అహముతో అరసి చూడ
అంధులను జేసి అందినదంత దోచి
అవనికే గొప్పనౌ భారమయ్యె సాయి 85

తెల్లదొర లెల్ల ధనముల కొల్లగొట్ట
రాట్నములు మొద్దు బారెను రాతి శిలగ
ఇనుప యంత్రాలు చేనేత నిడెను చితిని
చేతి పని వారినొక మారు చేరు సాయి 86

కట్టు బొట్టు కున్న విలువ కాలరాసి
అంద చందాల పోటీలు అనుచు ఇలను
దొరికినది యంత కొందరు దోచ దలచి
కొత్త విధమున యోచింప గొనిరి సాయి 87

శిలను శిల్పముగా శిల్పి చెమట తోడ
తనను తీర్చిన దేవుని తనువు గూర్చె
శిథిలమై తాను జీవము శిలకు నింపి
నిరతము నిను కొలుచు చుండు నిజము సాయి 88

రెప్ప పాటైన రే రాజు రేయి పూట
నవ్వనంత ఆ రేయికి నగవు యేది
యింత ఈ వెన్నెలను గాంచు యింపు ఏది
నీదు మహిమల నిచ్చట నిలుపు సాయి 89

తపము చేసిన తీరని తాప మాయె
ఏమిటో ఎల్ల కాలము ఎదుగు చుండె
గాలిలో మేడ లెన్నెన్నొ గట్టి మురిసి
ఇపుడు గగనమ్ము నేదింప నెంచె సాయి 90

మంటలో గల్ప నేర్చిరి మనుజులంత
మానవీయ విలువలన్ని మతులు చెడగ
ఏమి చేయుదువో నీవు ఏలుకొనగ
తోలు బొమ్మలౌ జనులు నీ తోడు సాయి 91

## ఏర్చి కూర్చి పేర్చితిని... !

ధరణి నీ కాంతి సోకగ ధన్యమయ్యె
కలి అహము బూడిదయ్యె నీ కాలు తాకి
మూర్ఖ బుద్ధులు నిను చూసి మూగవోయె
మంచి వెలుగొందె నీ స్పర్శ మహిమ సాయి 92

ఏమిటయ్య నీ మాయకు ఏది అంతు
రాజ్య భోగాలు లేనట్టి రాజు వీవు
సిరులు గిరులెన్నొ యుండిన శివుని వీవె
విశ్వమంత నీదే ఏమి వింత సాయి 93

అలమటించు మా తోడ నీ వలగనేల
ఆదుకొను నాథుడవు నీకు నలుగ తగదు
లోకముల నేలు దొరవు నీలోన జగతి
నిండియుండెను ఇలనీవు నిలువు సాయి 94

అలమటించు వారల నంత అక్కు చేర్చు
దిక్కు లేని వారందరి దిక్కు నీవు
ఆకలి కడుపులన్నింటి నాలకించి
అందరిని దరిచేర్చుకో వయ్య సాయి. 95



పచ్చదనపు  పసిడి నేల పాయలందు
కాలకూట విషమదేదో కలిసెనేమొ
సిరులు విరియు చోటున రాళ్ళు చిందుచుండ
నీదు మహిమ దెల్పగ వచ్చి నిలువు సాయి 96

చెలిమి ముందు చెదిరిపోవు చీకటైన
సూర్య చంద్రుల చెలిమితో చూడ ధరణి
మంచి చెలిమితో నీవుండి మహిమ చూపు
చెదరనీయకు నీదైన చెలిమి సాయి 97

నీవు చేసిన లీలలు నీవు గాంచు
అన్నదమ్ముల పోరు ఈ అవని లోన
పాలి పగలాయె నిచ్చట పాము వోలె
విలువ మరచి జనము గక్క విషము సాయి 98

మాన్యుడ మహనీయుడవని మనముతోడ
కోటి కోటి దండంబుల కొలుచు చుంటి
మధ్యముడనైతి నేను నా మతిని గాంచు
కొలుచు కొనుచు గొప్పను చాటు కొందు సాయి 99

కులము లేదు మతము లేదు కుట్ర లేమి
పంతములును నీ చెంతన పట్టవోయి
మాయ జగతికి నీ మహిమలను దెల్పి
మానవతను పెంచితివి ఈ మహిన సాయి 100

రాముడవు నీవు ఏసు రహీము నీవు
ఏ విధముగ పిలిచిన మా యెదను చేరు
మమ్ము గన్న తండ్రివి నీవు మమ్ము గాంచు
మనుచు జీవులు తలప రావయ్య సాయి. 101

చిన్ననాటివౌ ఆటలు చిందు మరచె
చెలిమి చేయ ఆనాటి రోజేమి లేదు
మరల బాల్య మొకటి యున్న మాదుహృదిని
రాని బాల్యపుసిరి చూపరమ్ము సాయి 102

వయసు రేపిన బాసతో వరుస గలిపి
వావి వరుసల నెల్లను వదిలి నారు
వెట్టి తనముల పోగొట్టి వింత జూపి
జనుల మార్చగ బూనుము సాధు సాయి 103

అవనికే భారతావని అందమగుచు
కుల మతాల భిన్నత్వాన కుదిరి పొత్తు
ఐకమత్యమే సౌఖ్యమ్ము ఐన దిచట
మూడు వర్ణాల ధ్వజముగా మురియ సాయి 104

తోటలో పూలు నిను చేర తొందరపడి
కోర్కెతో నన్ను చూసి పక్కునను విరిసె
పువ్వులెన్ని కోసిన నింక పూలు మిగిలె
పువ్వు వదలక మెడలోన పొదుగు సాయి 105

తల్లిదండ్రుల వోలెను తనువు నిచ్చి
వెలుగు పంచెడి గురువుగా వెలసి నావు
లోకముల నేలు నీకు నా లోగిలంత
యిచ్చి యుంటి కాదన బోకు మెపుడు సాయి 106

పొత్తు కుదురునే పదముల పొగడ నిన్ను
నాదు బ్రతుకెంత నీ ముందు నాదు తండ్రి
నా తరంబే పలుకగ నీ నామమైన
నీదు కాలి ధూళినవను నేను సాయి 107

నీదు కరుణయే తోడుగ నిలువ నాకు
రచనయే రాని వాడను రాయ పూని
శతక మాలిక నల్లితి శరణు కోరి
ఇటకు విచ్చేసి గైకొని యేలు సాయి 108



సర్వేజనాస్సుఖినోభవంతు !



# శ్రీ సాయి కమనీయ చరితము

ఇందులో....

1. శ్రీ మాధవనగర సాయి క్షేత్రము
2. శ్రీ సాయి దీక్షా విధానము
3. శ్రీ సాయి అష్టోత్తర శతనామావళిః
4. శ్రీ సాయి చతుర్వేళ హారతులు
5. శ్రీ సాయి సప్తస్వర గీతికలు

# శ్రీ మాధవ నగర సాయి క్షేత్రము

శ్లో॥ సదానింబ వృక్షస్య మూలాధి వాసాత్
సుదా స్రావిణం తిక్తమప్య ప్రియంతం
తరుం కల్ప వృక్షాధికమ్ సాధయంతం
నమామీశ్వరం సద్గురుం సాయినాథమ్ ।

అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు దివ్య మంగళ స్వరూపుడైన భగవానుడు సాయిబాబ రూపంలో శ్రీరామ నవమి పర్వదినమున ఈ అవనిపై అవతరించాడు.మహారాష్ట్ర అహ్మద్ నగర్ జిల్లాలోని కోపర్‌గాన్ సమీపాన గోదావరి తీరంలో గల షిరిడీలోని మసీదును కోవెలగా మలచుకొని కొలువైనాడు. ప్రాణుల పట్ల దయను కలిగియుండాలని,అందరి దైవం ఒక్కడేనని చాటి, కనులుండి చూడలేని లోకానికి వెలుగు దారిని చూపాడు. బాబా నివసించు మసీదులో ఎల్లప్పుడు 'ధుని' (హోమ గుండం)ని వెలిగించేవారు. ప్రతి అణువులో నిండియుండి ప్రతి ఇంటిలో పూజలందుకొంటున్న పరమేశుడు సాయి. ఆయన లీలలు తెలుపగ ఈ జీవితం చాలదు. వ్రాయడానికి ఎన్ని పుటలైనా సరిపోవు.

ఇందూరుకు 5 కి.మీ. దూరంలో ఇప్పుడు మాధవనగర్ సాయిబాబ దేవస్థానం ఉన్న స్థానంలో క్రీ.శ.1930-35 సం॥ ప్రాంతంలో అంజయ్య అనే భక్తుడు రావిచెట్టు క్రింద బాబా ఫోటో పెట్టి ప్రతి నిత్యము భక్తి శ్రద్ధలతో పూజనాచరించేవాడు. ప్రతి గురువారము రోజున సాయి పల్లకితో ఒంటెద్దు బండిపై ఇందూరు పరిసర ప్రాంతాలలో భిక్షాటన చేసేవాడు. క్రీ.శ. 1945-55 సం॥ ప్రాంతంలో ద్వారకామాయిని ఏర్పాటు చేసి షిరిడీలో మాదిరిగా 'ధుని'ని వెలిగించేవారు.

అలా అంజయ్య అనే భక్తుడు సాయినాథుని సేవ చేస్తున్న రోజులలో 1962-63 సం॥ ప్రాంతంలో నవీపేట్ వాస్తవ్యులు శ్రీ కిష్టాపురం బాలాగౌడ్ గారు ఈ దారి వెంట ప్రయాణిస్తూ తన వాహనం చెడిపోగా ఆ రాత్రి ఇక్కడే బస చేశారు. ఆ రాత్రి సాయినాథుడు అంజయ్య, బాలాగౌడ్ గార్లకు స్వప్నంలో కనిపించి తనకు ఆలయము నిర్మించండని చెప్పినాడట.

జైపూర్ నుండి శ్రీ సాయిబాబ పాలరాతి విగ్రహాన్నితీసుకొని వచ్చి 21 రోజులు 101 మంది పురోహితులచే పూజా హోమాదులను జరిపించి క్రీ.శ. 1964 సం॥లో బాబా విగ్రహ ప్రతిష్ట చేయడం జరిగింది. ఆ కార్యక్రమానికి సాక్షాత్తు శ్రీ సాయినాథుని ద్వారా నవ నాణెములు పొందిన సాయి భక్తురాలు శ్రీమతి లక్ష్మీబాయి షిండే గారు షిరిడీ నుండి వచ్చారు. 1972 సం॥లో ఈ దేవస్థానం రాష్ట్ర దేవాదాయ శాఖ పరిధిలోకి వచ్చింది. 6 ఎకరాల 30 గుంటల భూమిని శ్రీ సుబ్బారెడ్డి (మోస్రా) గారు ఆలయానికి విరాళముగా అందజేశారు. ఆలయ అభివృద్ధి కమిటీ చైర్మన్‌లుగా పదవీ బాధ్యతలను చేపట్టినవారు, అభివృద్ధికై కృషి చేసినారు. ఆలయ సిబ్బంది, అర్చక బృందము మరియు భక్తుల సహాయ సహకారములతో దేవాలయం దినదినాభివృద్ధి చెందుతూ ఉంది.

ఆలయ ప్రాంగణంలో శ్రీ గణపతి, శివుడు, నాగేంద్రుడు, సీతారామ లక్ష్మణులు, ఆంజనేయ స్వామి, శ్రీ పద్మావతీ శ్రీనివాసులు, దత్తాత్రేయులు, నవగ్రహాలు మొదలగు దేవతామూర్తులు దర్శనమిస్తారు. ఎల్లప్పుడు ద్వారకామాయిలో వెలుగొందే 'ధుని' లోని విభూతి సర్వరోగహరిణి, సర్వ పాప నివారిణి.

ఇక్కడి మందిరములో షిరిడీలో మాదిరిగా నాలుగు వేళలందు హారతులివ్వడం జరుగుతుంది. ఉ॥ 5-15 ని॥లకు కాకడ హారతి, మ॥ 12-00 గం॥లకు మధ్యాహ్న హారతి, సాయం సంధ్యా సమయంలో సంధ్యా హారతి,రాత్రి 10 గం॥లకు శేజారతి ఉంటుంది. ప్రతి గురువారం రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుండి వచ్చిన భక్తులు నిండైన మనస్సుతో

బాబాను కొలుస్తారు. ఇదే రోజున సాయంత్రం సాయికి పల్లకీ సేవ జరుగుతుంది.

సాయి జన్మదినమైన శ్రీరామనవమి, సద్గురుని శ్రీ గురు పౌర్ణిమ సాయినాథుని పుణ్యతిథియైన విజయదశమి (బాబా సమాధియైన రోజు), దత్త రూపుని శ్రీ దత్త జయంతి రోజులలో అశేష భక్తజనావళి తరలిరాగ ఘనముగా వేడుకలు జరుగుతాయి.

అష్టదిక్కులే అష్టైశ్వర్యములుగా, పంచభూతములే పంచభక్ష పరమాన్నములుగా మలచుకొన్న సచ్చిదానంద రూపునకు ఈ ఇందూరు అవని తన మదినే మందిరముగా చేయగా నిత్య పూజలతో మరో షిరిడీగా మారిపోయింది.

భక్తుల కొరకు నీటి సరఫరా, వసతిగృహాలు, వంట గదులు, స్నానపు గదులు, మరుగుదొడ్లు వంటి సౌకర్యములను కల్పించడం జరిగినది.



ఓం
శ్రీ సాయి



# శ్రీ సాయి దీక్షా విధానము

మానవునికి శాంతి సౌఖ్యములను సమకూర్చేది భక్తి.ఆ సాయినాథుని కృపాకటాక్షములు ఎల్లవేళల తోడుండాలనిచేసే ప్రయత్నమే శ్రీ సాయిదీక్ష . ఈ దీక్షను శ్రీ సాయి పుట్టిన రోజగు శ్రీరామ నవమికి ముందు, శ్రీ సద్గురుని గురు పౌర్ణిమగు ఆషాఢ పౌర్ణిమకు ముందు, శ్రీ సాయి పుణ్యతిథి యగు విజయదశమికి ముందు, శ్రీ దత్త జయంతి యగు మార్గశిర పౌర్ణిమకు ముందు మండలము, అర్ధ మండలము, సప్తాహంగా వీలును బట్టి స్వీకరించవచ్చును.

**దీక్షకు అవసరమగు వస్తువులు :**

రెండు మాలలు. ఒకటి ధారణమాల, రెండవది జపమాల. మాలలలో తులసీ, రుద్రాక్ష స్ఫటిక, రక్త చందన రకాలున్నాయి. వీటిలో తులసీమాల శ్రేష్ఠము. తెలుపు రంగు దీక్షా వస్త్రములు, అలంకరణ కొరకు గంధము, విభూతి, కుంకుమ, పూజ కొరకు పసుపు, కుంకుమ, అక్షింతలు, అగరవత్తులు, గంధము, కర్పూరం, కలకండ (కడి చక్కెర), పన్నీరు, పీచుతో కూడిన నారికేళం, ఊదు, విభూతి చూర్ణం, ప్రమిదలు, గంట, ఏక మరియు పంచ హారతులు, ఉదాని, వత్తులు, మంచి నూనె, సాయి బాబా విగ్రహం లేదా బాబా, గణపతి, దత్తాత్రేయుల చిత్రపటాలు.

**మాలాధారణ విధానము :**

మాలాధారణ రోజు ఉదయమే తలంటు స్నానాది కార్యక్రమాలు పూర్తి చేసుకొని దీక్షా దుస్తులు ధరించి తల్లిదండ్రుల ఆశీర్వాదం పొంది సాయి కాకడహారతికి (ఉ॥ 5-15 ని॥) ముందుగా ఆలయాన్ని చేరి కాకడ హారతి అనంతరం గురు స్వామి లేదా పూజారి చేత మాలధారణ చేయవలెను. తరువాత తాను నివసించు ప్రదేశంలో పీఠం ఏర్పాటు చేసుకొని సాయి విగ్రహం, చిత్ర పటాలు, గురుస్వామి ఇచ్చిన నారికేళం ఉంచి నిత్యం పూజించాలి.

## దీక్షా నియమాలు :

1. ప్రతి రోజు సూర్యోదయం కన్నా ముందు మరియు సూర్యాస్త మయం తర్వాత చల్లని నీటితో తలస్నానం చేయాలి.
2. స్నానానంతరం దీక్షా వస్త్రధారణ కాగానే గంధం, కుంకుమ, విభూతి ధరించాలి.
3. పీఠం వద్ద శుభ్ర పరచి సాయినాథునికి అభిషేకము చేసి దీపారాధన అనంతరం అష్టోత్తరంతో కూడిన అర్చన గావించి ధూపం చూపించి కలకండ నైవేద్యం సమర్పించి, కర్పూర హారతి యిచ్చి మంత్ర పుష్ప సాష్టాంగ నమస్కారాలతో పూజ నాచరించవలెను.
4. మధ్యాహ్నం 12 గం॥లకు మహా నైవేద్యం చూపి పంచ హారతులతో మధ్యాహ్న హారతి సాయికి ఇచ్చి అనంతరం భోజనం చేయాలి. ఆహారం సాత్వికమై ఉండాలి.
5. సూర్యాస్తమయం అనంతరం స్నానాది కార్యక్రమాలు జరిపిన తరువాత ఏక హారతితో ప్రదోష పూజ (సంధ్యా హారతి) ను, రాత్రి 10 గం॥లకు శేజారతి నివ్వాలి.
6. దీక్షా సాధకుడు ప్రతి రోజు ఒకే పూట భోజనం చేసి రాత్రికి పాలు, ఫలములు మాత్రమే తీసుకోవాలి. నేలపైనే నిద్రించాలి. నిరంతరం సాయి నామం జపిస్తు గురు స్వామి ఉపదేశించిన మంత్రమును ఉదయం 108 సార్లు, రాత్రి 108 సార్లు స్మరించాలి
7. తను నిర్వర్తించే వృత్తులను నిర్వర్తిస్తు వీలైన సమయంలో సాయి జీవిత చరితము సాయి లీలామృతము నిత్య పారాయణము చేయాలి.
8. భూత దయను కలిగి వుండి, ప్రతి జీవిలో సాయిని దర్శించాలి.
9. ఇతరులను సాయిరాం అని గాని, సాయి శరణం అని గాని సంబోధించాలి.

10. ప్రతి స్త్రీలోను తల్లిని చూడవలెను.

11. వీలును బట్టి ఆలయ దర్శనం చేయాలి. దైవ భక్తి కార్యక్రమాల్లో పాల్గొనాలి.

12. తీసుకొనే ప్రసాదము భోజనం పరిశుభ్ర స్థలంలో ఒకే సారి తీసుకోవాలి.

13. ఆర్థిక పరిస్థితిని బట్టి అన్నదాన కార్యక్రమాలు చేపట్టాలి.

**దీక్షలో చేయకూడనివి :**

1. తెలుపు దుస్తులు తప్ప ఇతర రంగు దుస్తులు ధరించకూడదు.

2. క్షౌరము చేయుకూడదు, గోళ్ళు తీయకూడదు.

3. క్రీములు, నూనెలు, సబ్బులు వాడకూడదు.

4. విలాసాలకు, హాస్యానికి, రాజకీయ విషయములకు దూరంగా వుండాలి. (న్యూస్ పేపర్ చదవకూడదు. టి.వి, సినిమాలు చూడకూడదు).

5. ధూమపానం, మద్యపానం, మాంసాహారమును విడిచిపెట్టాలి.

6. పాదరక్షలు ధరించకూడదు.

**దీక్షావిరమణ :**

దీక్ష పూర్తయిన మరుసటి రోజు ఉదయం పీఠం వద్ద పూజా కార్యక్రమాలు జరిపి పీఠంను కదిలించి పీఠంపై గల నారికేళమును తీసుకొని దానితో స్వామి వారి పూజా వస్తువులు, నైవేద్యంతో శ్రీ సాయిబాబా మందిరమును చేరి గురు స్వామి లేదా పూజారి చే దీక్షా విరమణ చేయాలి. శాంతిని చేకూర్చు శ్రీ సాయిబాబా దీక్షను కుల మత భేదాలు లేకుండా స్వీకరించిన కార్యసిద్ధి తప్పక జరుగును.

# శ్రీ సాయినాథ అష్టోత్తర శతనామావళిః

ఓం శ్రీసాయినాథాయ నమః
ఓం లక్ష్మీనారాయణనాయ నమః
ఓం కృష్ణరామశివ మారుత్యాది రూపాయ నమః
ఓం శేషశాయినే నమః
ఓం గోదావరీతట షిర్డీవాసినే నమః
ఓం భక్త హృదాలయాయ నమః
ఓం సర్వహృదాలయాయ నమః
ఓం భూతావాసాయ నమః
ఓం భూత భవిష్యద్భావ వర్జితాయ నమః
ఓం కాలాతీతాయ నమః
ఓం కాలాయ నమః
ఓం కాలకాలాయ నమః
ఓం కాలదర్ప దమనాయ నమః
ఓం మృత్యుంజయాయ నమః
ఓం అమర్త్యాయ నమః
ఓం మర్త్యా భయ ప్రదాయ నమః
ఓం జీవాధారాయ నమః
ఓం సర్వాధారాయ నమః
ఓం భక్తావన సమర్థాయ నమః
ఓం భక్తావన ప్రతిజ్ఞాయ నమః
ఓం అన్న వస్త్రదాయ నమః
ఓం ఆరోగ్య క్షేమదాయ నమః
ఓం ధనమాంగల్య ప్రదాయ నమః
ఓం బుద్ధి సిద్ధిప్రదాయ నమః
ఓం పుత్ర మిత్ర కళత్ర బంధుదాయ నమః
ఓం యోగక్షేమ వహాయ నమః
ఓం ఆపద్బాంధవాయ నమః
ఓం మార్గబాంధవే నమః
ఓం భుక్తిముక్తి స్వర్గాపవర్గదాయ నమః
ఓం ప్రియాయ నమః
ఓం ప్రీతి వర్ధనాయ నమః
ఓం అంతర్యామినే నమః
ఓం సచ్చిదాత్మనే నమః
ఓం నిత్యానందాయ నమః
ఓం పరమసుఖదాయ నమః
ఓం పరమేశ్వరాయ నమః
ఓం పరబ్రాహ్మణే నమః
ఓం పరమాత్మనే నమః
ఓం జ్ఞాన స్వరూపిణే నమః
ఓం జగతః పిత్రే నమః
ఓం భక్తానాం మాతృ దాతృ పితా మహాయ నమః
ఓం భక్తా భయ ప్రదాయ నమః
ఓం భక్త పరాధీనాయ నమః
ఓం భక్తానుగ్రహకారకాయ నమః
ఓం శరణాగత వత్సలాయ నమః
ఓం భక్తి శక్తి ప్రదాయ నమః
ఓం జ్ఞాన వైరాగ్య ప్రదాయ నమః
ఓం ప్రేమప్రదాయ నమః
ఓం సంక్షయహృదయ దౌర్బల్య పాపకర్మ వాసనాక్షయకరాయ నమః
ఓం హృదయగ్రంథి భేదకాయ నమః

